# వేమన శతకము.

టీకా తాత్పర్య సహితము.

(పండిత పరిశోధితము)



పబ్లిషర్సు.

## సీతారాం కంపెనీ,

బుక్కు సెల్లర్సు

## తెనాలి.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

1925.



——

వెల 0—3—0.

# రామా అండ్ కో. ప్రచురములు.

| | | | | |
|---|---|---|---|---|
| అక్షరాభ్యాస సహకారికా చిత్రలేఖనము | | | | |
| | I వ భాగము | 0 | 2 | 0 |
| డిటో | II వ భాగము | 0 | 2 | 6 |
| రామా మొదటివాచకము | అచ్చవుచు | 0 | 2 | 6 |
| రామా రెండవవాచకము | | 0 | 3 | 0 |
| మొదటితరగతి నాటకములకథలు అచ్చవుచు | | 0 | 2 | 0 |
| రెండవతరగతి | డిటో | 0 | 2 | 6 |
| మూడవతరగతి | డిటో | 0 | 3 | 0 |
| నాల్గవతరగతి | డిటో | 0 | 4 | 0 |
| అయిదవతరగతి | డిటో | 0 | 5 | 0 |
| రెండవతరగతి లోకజ్ఞానము | డిటో | 0 | 3 | 0 |
| మూడవతరగతి డిటో | డిటో | 0 | 4 | 0 |
| నాల్గవతరగతి డిటో | డిటో | 0 | 5 | 0 |
| 2-3-4 తరగతులకు ఒకేపుస్తకము | | 0 | 10 | 0 |
| అయిదవతరగతి అచ్చులోనున్నది. | | | | |
| హిందూదేశచరిత్ర 4 వతరగతికి | | 0 | 4 | 0 |
| సివిక్సుపాఠములు 2-3తరగతులకు | | 0 | 2 | 0 |
| సివిక్సుమ్యాన్యుయులు 4-5తరగతులకు | | 0 | 8 | 0 |
| ప్రథమపాఠశాలలఆరోగ్యబోధిని | | 0 | 4 | 0 |
| హైజినిక్ ఫిజియాలజి | I వ భాగము | 1 | 6 | 0 |
| డిటో | II వ భాగము | 1 | 8 | 0 |

వలయువారు—రామా అండ్ కో ఏలూరు.



# వేమనరత్నములు.

—॥ మంచివస్తువు

ఆ. నిక్కమైన మంచి నీల మొక్కటి చాలుఁ
దళుకు బెళుకురాళ్ళు తట్టెడేల
చాటుపద్యమిలను జాలదా యొక్కటి
విశ్వదాభిరామ వినర వేమ.

టీ. విశ్వదాభిరామ=లోకమునకు బ్రియమైనవాడా ! వేమ=వేమా, వినర=వినుము; నిక్కమైన=నిజమైన; మంచి=మంచి; నీలము=నీలములను పేరు గల రాయి; ఒక్కటి=ఒకటి, చాలున్=చాలును; తళుకు బెళుకు రాళ్ళు=చూచినంతనే భ్రమింపఁజేయు నట్టి మెఱుపుతోఁగూడుకొన్న రాళ్లు; తట్టెడు=గంపెడు; ఏల=ఎందుకు; చాటుపద్యము=రసము-భావము గలిగి విడిగా వ్రాయఁబడు పద్యము; ఇలను=భూమియందు; చాలదా=చాలదా; ఒక్కటి=ఒకటి.

తా. లోకమునకు బ్రియమైన ఓ వేమా ! లాభములేని మెఱుపుతోఁ గూడుకొన్న రాళ్ళు తట్టెడైనను బనికిరావు. రసభావములు గలిగిన చాటుపద్య మొక్కటి చాలినట్లే మంచి నీల మొక్కటి చాలును.

ఆ. గంగిగోవు పాలు గంటెడైనను జాలుఁ
కడవెడైన నేల ఖరముపాలు
భక్తి కలుగుకూడు పట్టెడే చాలురా విశ్వ. 2

టీ. విశ్వ...గంగిగోవుపాలు=నల్లనియావు పాలు; గంటెడైనను=గరిటెడైనను; చాలుఁ=చాలును; కడవెడైన=కుండెడైన; ఏల=ఎందుకు, ఖరముపాలు=గాడిదెపాలు; భక్తి=భక్తి; కలుగు=ఉన్న; కూడు=అన్నము, పట్టెడే=పట్టెడైనా; చాలురా=చాలును.

తా. కడవెడు గాడిదపాలుకంటె నల్లనియావు పాలు గరిటెడైనను చాలును. భక్తిగలిగి పెట్టు అన్నము పట్టెడే చాలును.

—♦ చిత్తశుద్ధి. ♦—

ఆ. చిత్తశుద్ధి కలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదవకాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత విశ్వ. 3

టీ. విశ్వ...వేమ;-చిత్తశుద్ధి=మనస్సులోపలకల్మషములేకుండనుండి; చేసిన=యొనర్చిన; పుణ్యము=మంచికార్యము; కొంచెమైనను=స్వల్పమైనను; అదియు=అది; కొదవకాదు=వృథకాదు; విత్తనంబు=బీజము, మఱ్ఱివృక్షంబునకు=మఱ్ఱిచెట్టునకు; ఎంత=ఎంత.

తా. మనస్సులో కల్మషము లేకుండ చేసిన పుణ్యము కొంచెమైనను వృథకాదు. అంత పెద్ద మఱ్ఱిచెట్టునకు విత్తన మెంత యుండును.

ఆ. ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా విశ్వ. 4

టీ. విశ్వ...వేమ-ఆత్మశుద్ధి=మనస్సు నిర్మలముగా నుండుట; లేని, లేకయున్న; ఆచారము=ఆచారము; అది=అది; ఏల=ఎందుకు; భాండ

శుద్ధి=శుండ కడుగుకొనుట; లేని=లేనట్టి; పాకము=వంట; ఏల=ఎందుకు; చిత్తశుద్ధి=చిత్తశుద్ధి; లేని, శివపూజ=ఈశ్వరుని గొలుచుట-ఏలరా—

తా. మనస్సు సరిగా లేని వట్టి యాచారమెందుకు? కుండ కడుగు కొనకుండ వంటజేసికొనుట యేమి బాగుండును. అట్లే చిత్తశుద్ధి లేని శివ పూజ యెందుకు ?

—♦ సజ్జనుఁడు ♦—

ఆ. మిరెపగింజ చూడ మీద నల్లగనుండు
గొఱికి చూడ లోన జుఱుకు మనును
సజ్జనులగు వారి సార మిట్లుండురా విశ్వ. 5

టీ. విశ్వ... వేమ;—మిరెపగింజ, చూడ=చూచిన, మీద=పైన, నల్లగ నుండు; కొఱికిచూడ=కొఱికిచూచిన; లోన=లోపల; చుఱుకుమనును= మంటపెట్టును; సజ్జనులు=మంచిపురుషులు; అగువారి=అయినవారి; సారము=బలము; ఇట్లుండురా=ఇటులుండును.

తా. మిరెపగింజ చూపులకు చిన్నదిగానుండి, కొఱికినచో నెట్లు కారముగ నుండునో, యట్లే సజ్జనులు పైకి గనఁబడక యుందురు.

ఆ. మృగమదంబుచూడ మీద నల్లగనుండు
బరిఢవిల్లు దాని పరిమళంబు
గురువులైనవారి గుణములీలాగురా విశ్వ. 6

విశ్వ... వేమ; మృగమదంబు=కస్తూరి; చూడ=చూడగా; మీద= పైన, నల్లగనుండు=నల్లగానుండును, పరిఢవిల్లు = ప్రకాశించును, దాని= దానియొక్క, పరిమళంబు=సువాసన, గురువులైనవారి = సజ్జనులగువారి, గుణములు=గుణములు, ఈలాగురా...

తా. కస్తూరి పైకి నల్లగనున్నను పైకి దాని మంచివాసన యెట్లు ప్రకాశించునో, యట్లే సజ్జనుల గుణములుగూడ నుండును.

## —♦ అల్పుఁడు - సజ్జనుఁడు ♦—

ఆ. అల్పుఁ డెపుడుపల్కు నాడంబరముగాను
సజ్జనుండుపల్కుఁ జల్లగాను
గంచు పలికినట్లు కనకంబుపల్కునా విశ్వ. 7

టీ. విశ్వ...రామ; అల్పుఁడు=హీనగుణముకలవాడు, ఎపుడు=ఎప్పుడు, పల్కున్=పలుకును, ఆడంబరముగాను=బడాయితో, సజ్జనుఁడు=మంచిగుణముకలవాడు, పల్కున్=పలుకును, చల్లగాను=శాంతముతో, కంచు-పలికినట్లు=మ్రోగినట్లు, కనకంబు=బంగారము-పలుకునా ?

ఆ. నిండునదులుపాఱు నిలిచి గంభీరమై
వెఱ్ఱివాగు పాఱు వేగఁబొర్లి
అల్పుఁడాడుగీతి నధికుండునాడునా విశ్వ. 8

టీ. విశ్వ...వేమా; నిండునదులు=బాగుగా జలముతో నిండియున్న నదులు, పాఱు=ప్రవహించును, నిలిచి=నిలిచి, గంభీరమై=గంభీరముగ, వెఱ్ఱివాగు=చిన్నప్రవాహము, పాఱు, వేగ = శీఘ్రముగా, పొర్లి, అల్పుడు=హీనగుణములు కలవాడు, ఆడురీతి=పలుకువిధమున, అధికుడు=గొప్పవాడు, ఆడునా ?

తా. చిన్న చిన్న ప్రవాహములు శీఘ్రగతిని పొర్లుచు బ్రవహించును. నిండునది గంభీరముగా నిలిచియుండును. అట్లే అల్పుడు పలికినట్లు అధికుడు పలుకడు.

ఆ. గంగపాఱు నెప్పుడు గదలని గతితోడ
ముఱికివాగుపాఱు మ్రోతతోడ
బెద్ద పిన్నతనము పేరిమి ఈలాగు విశ్వ. 9

టీ. విశ్వ... వేమ-గంగ=గంగానది, పాఱున్=పాఱును; ఎప్పుడు, కదలని=చలనములేని, గతితోడ=నడకతోడ, ముఱికివాగు = ముఱికివాగు, పాఱు, మ్రోతతోడ=చప్పుడుతోడ, పెద్ద పిన్నతనము పేరిమి=అల్పులకును-సజ్జనులకుంగల భేదము ఇట్లే యుండును.

తా. గంగానది చలనములేకుండ ప్రవహించును. ముఱికివాగు ధ్వనితో ప్రవహించును. పెద్దపిన్నలకు భేద మిట్లేయుండును.

—♦ ఉత్తముఁడు. ♦—

ఆ. నేర నన్నవాఁడు నెఱజాణ మహిలోన
నేర్తు నన్నవాఁడు నిందఁజెందు
నూరకున్నవాఁడె యుత్తమయోగిరా విశ్వ. 10

టీ. విశ్వ... వేమ; నేరనన్నవాఁడు = తెలియదని చెప్పువాఁడు; నెఱజాణ=మంచి తెలివిగలవాఁడు; నేర్తునన్నవాఁడు=సర్వము తెలియునని చెప్పువాఁడు; నిందజెందు = అపవాద పొందును; ఊరకున్నవాఁడె=ఏమియు దెలియదని చెప్పువాఁడే; ఉత్తమయోగిరా=మంచియోగి.

తా. తెలియదని చెప్పువాఁడే మంచి తెలివిగలవాఁడు. తెలిసినదని చెప్పువాఁడు నిందబొందును. ఏమియు దెలియదని యూరకున్నవాఁడే యుత్తముఁడు.

—♦ పిఱికివాఁడు. ♦—

ఆ. మేడిపండు చూడ మేలిమై యుండును
బొట్టవిచ్చిచూడఁ బురుగులుండు
బిఱికివాని మదిని బింకమీలాగురా విశ్వ. 11

టీ. విశ్వ... వేమ- మేడిపండు-చూడ=చూచిన; మేలిమై యుండును=బాగుగా నుండును; పొట్ట=కడుపు; విచ్చి=తెఱచి; చూడ, పురుగు

లుండు=పురుగులుండును; పితికివాని=పితికివానియొక్క; మదిని=మనస్సులోపల; బింకము=గట్టితనము; ఈలాగురా.

తా. మేడిపండు పైకి బాగుగనుండి లోపల పురుగు లుండునట్లే పితికివాని మనస్సులో గట్టితన మట్లే యుండును.

— గుణము. —

ఆ. పూజకన్న నెంచ బుద్ధి నిదానంబు
మాటకన్న నెంచ మనసు దృఢము
కులముకన్న మిగుల గుణము ప్రధానంబు విశ్వ. 12

టీ. విశ్వ... వేమ, పూజకన్న=పూజకన్న, ఎంచ = ఆలోచించగా బుద్ధి=బుద్ధి, నిదానంబు = మంచిది; మాటకన్న, ఎంచ, మనసు, దృఢము = గట్టిది; కులముకన్న=జాతికన్న-గుణము=గుణము; ప్రధానము=ముఖ్యము.

తా. పూజకన్న బుద్ధినిదానముగా నుండవలెను. మాటకన్న మనస్సు దృఢముగా నుండవలయును. కులముకన్న గుణము ప్రధానమై యుండవలయును.

— సద్గుణుఁడు-దుర్గుణుఁడు. —

ఆ. కులములోన నొకడు గుణవంతుఁడుండిన
గులము వెలయువాని గుణముచేత
వెలయ వనములోన మలయజమున్నట్లు విశ్వ. 13

టీ. విశ్వ... వేమా-కులములోన = వంశములోన, ఒకడు, గుణవంతుడు=మంచిగుణములు కలవాడు; ఉండిన = ఉన్నచో; కులము, వెలయును=ప్రకాశించును; వెలయ, వనములోన=వనమందు, మలయజము= చందనవృక్షము; ఉన్నట్లు=ఉన్నవిధమున.

తా. వనములో చందన వృక్షమున్నట్లు సద్గుణవంతునిచేత గులము ప్రకాశించును.

ఆ. కులములోన నొకఁడు గుణహీనుఁడుండిన
కులము చెడును వాని గుణమువలన
ఎలమిఁ జెఱకునందు వెన్ను వెడలినట్లు విశ్వ. 14

టీ. విశ్వ... వేమ-కులములోన=కులమునందు, గుణహీనుఁడు=దుర్గుణుఁడు; ఉండిన=ఉన్నచో, కులము, చెడును = నశించును, వాని = వానియొక్క, గుణము వలన = గుణముచేత, ఎలమి, చెఱకునందు = చెఱకునందు, వెన్ను=పురుగు, వెడలినట్లు=బయలుదేరినట్లు.

తా. చెఱకునందు పురుగు బయలుదేరినట్లు కులములోన గుణహీనుఁడున్నచో వాని మూలమున గులము చెడును.

ఆ. ఉత్తముని కడుపున నోగు జన్మించిన
వాఁడె చెఱుచు వాని వంశమెల్ల
జెఱకు వెన్నుపుట్టి చెఱుపదా తీపెల్ల విశ్వ. 15

టీ. విశ్వ... వేమ-ఉత్తముని కడుపున = మంచివాని కడుపున, ఓగు= చెడ్డవాఁడు, జన్మించిన=పుట్టిన, వాఁడె=వాఁడే, చెఱచు=చెఱచు, వాని= వానియొక్క, వంశమెల్ల=కులమెల్ల, చెఱకు = చెఱకున, వెన్నుపుట్టి = వెన్నుపుట్టి, చెఱుపదా=చెఱుపదా, తీపెల్ల=తీపినెల్ల

తా. చెఱకున వెన్నుబుట్టి తీపినంతయు చెఱుపునట్లు మంచికులమున చెడ్డవాఁడుబుట్టి ఆకులమును జెఱచును.

ఆ. రాముఁ డొకఁడుపుట్టి రవికులమీడేర్చె
కురుపతి జనియించి కులము జెఱిచె
ఇలను బుణ్య పాప మీలాగుగాదకో విశ్వ. 16

టీ. విశ్వ... వేమ-రాముఁడు = రాముఁడను వాఁడు, ఒకఁడు, పుట్టి= జనియించి, రవికులము=సూర్యకులము, ఈడేర్చె=వృద్ధిఁబొందించెను, కురు

పతి=కౌరవులలో పెద్దవాడైన దుర్యోధనుఁడు, జనియించి=పుట్టి, కులము=కులము, చెఱిచె=చెఱచెను, ఇలను=భూమిపై, పుణ్యపాపములు = పుణ్యమును పాపమును, ఈలాగ=ఈలాగున, కాదకో=కాదా?

తా. శ్రీరాముఁడు జనించి రవికులమునకు కీర్తి దెచ్చెను. దుర్యోధనుఁడు జనించి కురుకులమునకు నాశనము గూర్చెను. పుణ్య పాపము లిట్లే యుండును.

—♦ కుత్సితుఁడు ♦—

ఆ. వేఱుపురుగు జేరి వృక్షంబుఁ జెఱచును
జీడపురుగు చేరి చెట్టు జెఱుచుఁ
గుత్సితుండు చేరి గుణవంతు జెఱుచురా విశ్వ. 17

టీ. విశ్వ... వేమ- వేఱుపురుగు=వేరునందుపురుగు, చేరి, వృక్షంబు=చెట్టును, చెఱుచును, చీడపురుగు=చీడపురుగు, చేరి, చెట్టు, చెఱుచు, కుత్సితుఁడు=దుర్గుణములు కలవాఁడు, చేరి, గుణవంతు=మంచిగుణములు కలవానిని, చెఱుచురా=చెఱుచును.

ఆ. హీనగుణమువాని నిలుసేర నిచ్చిన
ఎంతవానికైన నిడుమ గలుగు
ఈఁగ కడుపుచొచ్చి యిట్టట్టు సేయదా విశ్వ. 18

టీ. విశ్వ... వేమ—హీనగుణమువాని=హీనగుణము కలవానిని; ఇలు=ఇల్లును; సేరనిచ్చిన=ప్రవేశింపనిచ్చిన; ఎంతవానికైన=ఎటువంటివానికైన; ఇడుమ=బాధ; కలుగు=కలుగును; ఈఁగ-కడుపుచొచ్చి=కడుపునఁ బ్రవేశించి; యిట్టిట్టు=తలక్రిందుగా, సేయదా

తా. దుర్గుణుని ఇల్లు సేరనిచ్చినచో, యెంతటివానికైనను- ఈఁగ కడుపులో బ్రవేశించి బాధ కలుగజేయునట్లు బాధ కలుగచేయును.

## —♦ హీనుఁడు. ♦—

ఆ. హీనుఁ డెన్నివిద్య లిలను నేర్చినగాని
ఘనుడుగాడు హీన జనుడె గాని
పరిమళములు గార్ధభము మోయ గజమౌనె విశ్వ. 19

టీ. విశ్వ... వేమ-హీనుఁడు=హీనుడు; ఎన్నివిద్యలను = ఎన్నిచదువులను; నేర్చినగాని= నేర్చుకొన్నగాని; ఘనుడుగాడు = గొప్పవాడుకాడు; హీనజనుడె=హీనుఁడె; గాని, పరిమళములు=సువాసన ద్రవ్యములు; గార్ధభము=గాడిదె; మోయ=మోసినచో; గజమౌనె=ఏనుగౌనా.

తా. హీనుఁ డెన్ని విద్యలు నేర్చినను హీనుడేగాని గొప్పవాఁడు గాఁడు. సువాసన ద్రవ్యములు మోసినంతనే గాడిద యేనుగౌనా.

ఆ. విద్య లేనివాఁడు విద్యాధికుల చెంత
నుండినంత బండితుండు గాఁడు
కొలని హంసలకడఁ గొక్కెర యున్నట్లు విశ్వ. 20

టీ. విశ్వ—వేమ-విద్యలేనివాఁడు=చదువు లేనివాఁడు; విద్యాధికుల చెంత=చదువుకొన్నవారి దగ్గఱ; నుండినంత = ఉన్నంతనే, పండితుఁడు కాఁడు, కొలని హంసలకడ=సరస్సులో వుండే హంసలదగ్గఱ; కొక్కెర = కొంగ, యున్నట్లు=యుండినట్లు.

తా. హంసలకడ కొంగయున్న విధమున-చదువులేనివాఁడు చదువుకొన్నవాని దగ్గఱనున్న మాత్రమునఁ బండితుఁడు కాఁడు.

## —♦ అల్పుఁడు ♦—

ఆ. అల్పజాతివాని కధికారమిచ్చిన
దొడ్డవారి నెల్ల దోలితిరుగుఁ
జెప్పుదినెడి కుక్క చెఱకుతీపెఱుగునా విశ్వ. 21

టీ. విశ్వ... వేమ-అల్పజాతివానికి=నీచకులమువానికి, అధికారము=ఉన్నతమైన పదవిని, ఇచ్చిన=ఇచ్చినచో, దొడ్డవారినెల్ల=మంచివారినందరిని, తోలి=వెళ్ళగొట్టి, తిరుగున్=తిరుగును, చెప్పుదినెడి కుక్క=చెప్పుముక్కలను నములుకుక్క, చెఱకు=చెఱకుయొక్క, తీపి = తియ్యదనమును, ఎఱుగునా-ఎఱుగునా.

తా. అల్పునకు అధికారమిచ్చినచో మంచి వారిని వెళ్ళగొట్టును. చెప్పులదిను కుక్క చెఱకుతీపి యేమెఱుగును ?

ఆ. అల్పుడైన వాని కధిక భాగ్యముగల్గ
దొడ్డవారిఁ దిట్టి తోల గొట్టు
అల్పజాతి మొప్పె యధికుల నెఱుగునా విశ్వ. 22

విశ్వ... వేమ-అల్పుడైనవానికి = అల్పునకు, అధిక భాగ్యము = ఎక్కువభాగ్యము,కల్గ=కలిగిన, దొడ్డవారిన్=మంచివారిని, దిట్టి=దూషించి తోలగొట్టు=వెడలగొట్టును, అల్పజాతి=నీచకులమునందుబుట్టిన, మొప్పె=మూఢుఁడు, అధికుల=గొప్పవారిని, ఎఱుగునా=ఎఱుగునా.

తా. అల్పునకు భాగ్యము కలిగినచో మంచివారిని దిట్టి వెడలగొట్టును. నీచకులమున బుట్టిన మూఢుడధికుల నెఱుగగలడా ?

ఆ. ఎద్దుకైనగాని యేఁడాది తెల్పిన
మాట దెలిసి నడుచు మర్మమెఱిగి
మొప్పె తెలియలేడు ముప్పదేండ్లకునైన విశ్వ. 24

టీ. విశ్వ... వేమ- ఎద్దునకైనగాని = ఎద్దునకైనా, యేఁడాది=ఒక సంవత్సరము, తెల్పిన= తెలిపినచో, మాటదెలిసి = మాటలుగ్రహించి, నడుచు=నడుచును. మర్మమెఱిగి = రహస్యమునుగనుగొని, మొప్పె=మూఢుడు, తెలియలేడు=ఎఱుగలేడు,ముప్పదేండ్లకునైన=ముప్పదిసంవత్సరములకయినా!

తా. ఎద్దునకైనా యొక సంవత్సరము తెలిపినచో మాటను గ్రహించి యాది నడచునుగాని, మూఢునకు ముప్పదేండ్లకునైన నేర్వలేడు.

ఆ. ఎలుకతోలు దెచ్చి యేడాదియుతికిన
నలుపు నలుపెగాని తెలుపుగాదు
కొయ్యబొమ్మఁదెచ్చి కొట్టిన బలుకదు విశ్వ. 25

టీ. విశ్వ... వేమ- ఎలుకతోలు = ఎలుకయొక్క చర్మమును, తెచ్చి, యేడాది=ఒకసంవత్సరము, ఉతికిన=ఉతికినను, నలుపు, నలుపే గాని=నలుపేగాని, తెలుపుగాదు = తెలుపుబడదు, కొయ్యబొమ్మన్=కొయ్యబొమ్మను, తెచ్చి=తీసికొనివచ్చి, కొట్టిన=కొట్టినచో, పలుకదు=మాటలాడదు.

తా. కొయ్యబొమ్మనుదెచ్చి కొట్టినచో పలుకనివిధమున, యెలుక చర్మము ఒక సంవత్సరముతికినను తెల్లబడదు.

—♦ ఖ లు డు ♦—

ఆ. పాముకన్న లేదు పాపిష్ఠిజీవంబు
అట్టిపాము చెప్పినట్లు వినును
ఖలునిగుణముమాన్ప ఘనులెవ్వరును లేరు విశ్వ. 26

విశ్వ... వేమ-పాముకన్న=సర్పముకంటె, లేదు, పాపిష్టి=పాపము జేసికొనిన, జీవంబు=జంతువు, అట్టి పాము=అటువంటి పాము, చెప్పినట్టె=చెప్పినప్రకారమే,వినును, ఖలుని=నీచునియొక్క,గుణము=బుద్ధి,మాన్ప=మాన్పదగిన, ఘనులు=గొప్పవారు, ఎవ్వరును లేరు.

తా. పాపపుజంతువైన పాము చెప్పినట్లు వినునుగాని, ఖలునిగుణము మాత్ర మెవ్వరును మాన్పజాలరు.

ఆ. వేముపాలువోసి ప్రేమతోఁ బెంచిన
చేఁదువిఱిగితీపు చెందఁబోదు
ఓగునోగగాక యుచితజ్ఞుఁడెటులౌను విశ్వ. 27

టీ. విశ్వ, వేమ=వేపచెట్టు, పాలువోసి=పాలనుపోసి ప్రేమతో=ప్రీతితో, పెంచిన=పెంచినను, చేఁదు=చేదుతనము, విఱిగి=పోయి, తీపు=తీపితనము, చెందబోదు=పొందబోదు, ఓగు=చెడ్డవాఁడు, ఓగగాక=చెడ్డవాఁడే, యుచితజ్ఞుఁడు=తెలివికలవాఁడు, ఎటులౌను=ఎట్టులౌను.

తా. పాలుపోసి పెంచినను వేపచెట్టు తన చేదును విడువనట్లు చెడ్డవాఁడు చెడ్డవాఁడే యగును గాని మంచివాఁడెట్లగును ?

ఆ. పాలుపంచదార పాపరపండ్లలో
జాలఁబోసివండఁ జవికిరాదు
కుటిలమానవులకు గుణమేల గల్గురా విశ్వ.

విశ్వ... వేమ-పాలు=పంచదార-పాపరపండ్ల=అవి యొక విధమైన చేదుపండ్లలో, చాలన్=ఎక్కువగా, పోసి-వండన్=వండినను, జవికిరాదు=రుచికలుగదు, కుటిలమానవులకు=ఖలులకు, గుణమేల=గుణమెట్లు, కలుగురా=కలుగును.

తా. చేదుపండులో పాలు పంచదార పోసి వండినను రుచి కలుగనట్లు కుటిలులకు మంచిగుణము రాదు.

ఆ. ముష్టివేఁపచెట్టు మొదలంట ప్రజలకు
బరఁగ మూలికలకుఁ బనికివచ్చు
నిర్దయాత్మకుండు నీచుఁడెందునకౌను విశ్వ. 29

టీ. విశ్వ... వేమ-ముష్టి=ముష్టిచెట్టున్నూ, వేపచెట్టు=వేపచెట్టున్నూ, మొదలంటు=మొదటివఱకును, ప్రజలకు=జనులకు, పరఁగ=ఒప్పుగా, మూలి

కలవు=ఔషధములవు, పనికివచ్చు=ఉపయోగపడును, నిర్దయాత్మకుండు=దయ లేనివాడు, నీచుడు=నీచగుణము కలవాఁడు, ఎందునకాను=ఎందులకు బనికివచ్చునా,

తా. ముష్టియు వేపయు మూలికలవు బనికివచ్చునుగాని నీచు డెందుకు బనికి రాడు.

ఆ. కాని వానితోడ గలసి మెలగుచున్న
గాని వానిగాన గాఁతురవని
దాటి క్రిందఁ బాలు ద్రాగిన చందమౌ విశ్వ. 30

టీ. విశ్వ... వేమ - కానివానితోడ=గౌరవము లేనివానితోడ, కలసి, మెలగుచున్న =తరుగుచున్న, కానివానిగానె = గౌరవము లేని వానిగనే, కాంతురు=చూతురు, అవని = భూమిని, తాటిక్రింద = తాటిచెట్టుక్రిఁద, పాలు, త్రాగినచందమౌ=త్రాగినట్లగును.

తా. చెడ్డవానితో గలిసి తిరుగుచున్నచో దాటిచెట్టుక్రింద పాలు త్రాగినట్లే యగును.

ఆ. కాని వానతోడ గలిసి వర్తించిన
హానివచ్చు నెంత వానికైన
దాటిక్రిందఁ బాలు ద్రాగినవిధమౌను విశ్వ. 31

టీ. విశ్వ... వేమ-కానివానితోడ=గౌరవములేనివానితోడ, కలిసి, వర్తించిన=తిరిగిన, హాని=ఆపద, వచ్చు=వచ్చును, ఎంతవానికైన=ఎట్టివానికైన, తాటిక్రింద = తాటిచెట్టుక్రింద, పాలు త్రాగిన, విధమౌను = రీతి యగును.

తా. గౌరవము లేనివానితో చరించినచో నెట్టివానికైనను తాటి క్రింద పాలు త్రాగినరీతి హానికలుగును.

—♦ నిలువదగనిచోటు ♦—

ఆ. పాలు నీడిగింట గ్రోలుచునుండెనా
మనుజులెల్లగూడి మద్యమండ్రు
నిలువదగనిచోట నిలువనిందలువచ్చు విశ్వ. 32

టీ. విశ్వ... వేమ-పాలు=పాలు, ఈడిగింట = ఈడిగింటిలో (కల్లు అమ్మువారికులము), గ్రోలుచునుండెనా=త్రాగుచున్నచో, మనుజులు=మనుష్యులు, ఎల్ల=అందఱు, కూడి=ఏకమై, మద్యమండ్రు=త్రాగుడందురు; నిలువదగని=నిలువకూడని, చోట=స్థలమున, నిలువ=నిలుచున్నచో, నిందలు=అపవాదులు,వచ్చు=వచ్చును.

తా. ఈడిగింట పాలు త్రాగినను లోకులు దానిని మద్యమే యందురు. అందుచే ఉండగూడని స్థలమున నున్నచో నిందవచ్చును.

—♦ తామసము ♦—

ఆ. తామసించి చేయదగ దెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమమగును
బచ్చికాయ దెచ్చి పడ వేయ ఫలమౌనె విశ్వ. 33

టీ. విశ్వ... వేమ—తామసించి=కోపించి, జేయదగదు=చేయకూడదు, ఎట్టి కార్యంబు=ఏ కార్యమైనను; వేగిరింప=తొందరపడినచో; అదియు=అదికూడా; విషమమగును=వ్యతిరేకమగును; పచ్చికాయ, తెచ్చి, పడవేయ=పండవేసినయెడల; ఫలమౌనె=ఫలమగునా.

తా. ఏకార్యమైనను గోపముచేతగాని తొందరపడిగాని చేసినచో నది చెడును. పచ్చికాయను పండవేసినచో ఫలమగునా ?

—♦ కో ప ము . ♦—

ఆ. కోపమునను ఘనత కొంచెమైపోవును
గోపమునను మిగుల గోడుగలుగు
గోపమడఁచనేని గోర్కెలు నీడేఱు విశ్వ. 34

టీ. విశ్వ... వేమ-కోపమునను=కోపముచేత, ఘనత = గొప్పతనము కొంచెమైపోవును=తగ్గిపోవును, కోపమునను=కోపముచేత, మిగుల=మిక్కిలి, గోడు=అల్లరి, కలుగు=కలుగును, కోపము=కోపమును, అడచెనేని=అడచినచో, కోర్కెలు, ఈడేఱు=సమకూడును.

తా. కోపము వలన గొప్పతనము పోవును. దానిచేత అల్లరి కలుగును. అది అడచుకొన్నచో నన్నికోర్కెలు తీరును.

ఆ. గురుబృహస్పతియును గుణమించుకయు లేక
చందమామకిచ్చె శాపమపుడు
గురుడుఁకోపమూన గూడదెప్పటికైన విశ్వ. 35

టీ. విశ్వ... వేమ -గురు=గురుడైన, బృహస్పతియును=బృహస్పతి యనునతడు, గుణము, ఇంచుకయు=కొంచెమైనను, లేక, చందమామకు=చంద్రునకు, ఇచ్చె=ఇచ్చెను, శాపము, అపుడు, గురుఁడు, కోపము=ఆగ్రహము, ఊన=వహింప, కూడదు, ఎప్పటికైన.

తా. బృహస్పతి యప్పుడు చంద్రునకు శాపమిచ్చెను. అట్లు గురుండైనవా డెప్పుడును నాగ్రహింపరాదు.

—♦ స్థా న బ లి మి . ♦—

ఆ. నీళ్ళమీద నోడ నిగిడి తిన్నగఁ బ్రాకు
బైటమూరెడైన బారలేదు
నెలవు దప్పుచోట నేర్పరి కొఱగాడు విశ్వ. 36

టీ. విశ్వ... వేమ- నీళ్ళమీద=నీటిపైని, ఓడ=ఓడ, నిగిడి, తిన్నగ, సరిగా, ప్రాకున్=ప్రాకును, బైట=ఈవల, మూరెడైన, పారలేదు=పోలేదు, నెలవు=తన స్థలము, తప్పుచోటు, నేర్పరి=తెలిసినవాడైనను, కొఱగాడు= పనికిరాడు.

తా. ఓడ నీటిమీఁద చక్కఁగ నడచును. ఈవల మూరెడైనను పోలేదు. అట్లే దన నెలవు దప్పినచో బుద్ధిమంతుడైనను పనికిరాడు.

ఆ. నీళ్ళలోన మీను నిగిడి దూరముపారు
బైట మూరెడైనఁ బారలేదు
స్థానబల్మిగాని తనబల్మి కాదయా విశ్వ. 37

టీ. విశ్వ... వేమ-నీళ్ళలోన=నీటియందు, మీను=చేప, నిగిడి, దూరము, పారు=పోవును, బైట = ఈవల మూరెడైన-పారలేదు=పోలేదు, స్థానబల్మి=తానున్న స్థలముయొక్క బలము, కాని, తనబల్మి=తనయొక్క బలము, కాదయా= కాదు.

తా నీటిలో చేప యెంతదూరమయినను పోవును. ఈవల మూరెడైనను పోలేదు. స్థానబల్మియేకాని తనబల్మి కాదు.

ఆ. నీళ్ళలోన మొసలి నిగిడి యేనుఁగుఁదీయు
బైటఁ గుక్కచేత భంగపడును
స్థానబల్మిగాని తన బల్మి కాదయా విశ్వ. 38

టీ. విశ్వ... వేమ-నీళ్ళలోన = నీటియందు, మొసలి, నిగిడి యేనుగున్=ఏనుగును, తీయు=లాగును, బైట, కుక్కచేత, భంగపడును, స్థానబల్మి=తానున్న స్థలబలము, కాని, తనబలిమి=తనబలము, కాదయా=లేదు,

తా. నీటిలో నున్నంతవఱకు మొసలి యేనుగును లాగగలదు. ఈవలకు వచ్చెనేని కుక్కచేత భంగమొందును. స్థాన బల్మియే కాని తన బలిమి కాదు.

—♦ కలిమి. ♦—

ఆ. కులము లేనివాఁడు కలిమిచే వెలయును
కలిమిలేనివాఁడు కులము దిగును
కులముకన్న భువిని కలిమి యెక్కువసుమీ విశ్వ. 39

విశ్వ... వేమ—కులములేనివాఁడు = కులముతక్కువవాఁడు, కలిమిచే= భాగ్యముచేత, వెలయును=ఒప్పును, కలిమిలేనివాఁడు=భాగ్యములేనివాఁడు, కులము, దిగును, కులముకన్న, భువిని = భూమిని, కలిమి = భాగ్యము, ఎక్కువసుమీ.

తా. కులహీనుడు భాగ్యముచేత నొప్పును. భాగ్యహీనునకు కుల ముండును. కులముకన్న సంపదయే యెక్కువ.

ఆ. కులము గలుగువాఁడు గోత్రంబుగలవాఁడు
విద్యచేత విఱ్ఱవీగువాఁడు
పసిడిగల్గువాని బానిసకొడుకులు విశ్వ. 40

టీ. విశ్వ... వేమ, కులముగలుగువాఁడు = మంచికులము గలవాఁడు, గోత్రంబుగలవాఁడు=మంచిగోత్రము కలవాఁడు, విద్యచేత=చదువుచేత, విఱ్ఱవీగువాఁడు=గర్వించువాఁడు, పసిడి = బంగారము, గల్గువాని = ఉన్నవాని, బానిసకొడుకులు=దాసీపుత్రులు.

తా. మంచి కులగోత్రములు గలవాడును, విద్య గలవాడును, ద్రవ్యవంతునకు దాసీపుత్రులని తలంపవలయును.

ఆ. నేర్పుగల్గువారు నెఱయోధులగువారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడిగల్గువాని బానిసకొడుకులు విశ్వ. 41

టీ. విశ్వ... వేమ-నేర్పుగలుగు వారు=అన్ని విషయములు నేర్చికొనినవారు, నెఱబోధులగువారు=మంచిబోధులగువారు, మంచిబోధులు, విద్యచేత=చదువుచేత, విఱ్ఱవీగువారు=గర్వించువారు, పసిడి, గల్గువారి, బానిస, కొడుకులు.

తా. అన్ని విషయములు తెలిసినవారైనను, బోధులైనను విద్యాధికులైనను, భాగ్యవంతునకు బానిసకొడుకులు.

ఆ. కనియు గానలేదు కదలింపడా నోరు
వినియు వినగలేదు విస్మయమున
సంపద గలవాని సన్నిపాతంబిది విశ్వ. 42

టీ. విశ్వ... వేమ- కనియు=చూచియు; కానలేదు=చూడలేదు; కదలింపడు=కదపడు; ఆనోరు=నోటిని; వినియు—వినగలేదు; విస్మయమున=ఆశ్చర్యమును; సంపదగలవాని=ద్రవ్యవంతుని; సన్నిపాతంబు = సన్నిపాతగుణము, ఇది.

తా. చూడకపోవుటయు; మాట వినిపించుకొనకపోవుటయు కలిమిగలవాని కున్న సన్నిపాతగుణములు.

—♦ లోభి ♦—

ఆ. గొడ్డుటావు బిదుకఁ గుండఁ గొంపోయిన
పాలనీక తన్నుఁ బండ్లురాల
లోభివాని నడుగ లాభంబులేదయా విశ్వ. 43

టీ. విశ్వ... వేమ-గొడ్డుటావును=గొడ్డావును; పిదుకఁ=పిదుకుటకు; కుండ=కుండ; కొంపోయిన = తీసికొనివెళ్ళిన; పాలనీక = పాలీయక; తన్నుఁ=తన్నును; పండ్లురాల = పళ్ళూడగ; లోభివాని = లోభివానిని; అడుగ=అడిగినందువలన; లాభంబు=సార్థకము, లేదయా=లేదు.

తా. గొడ్డుటావును బితుకుటకు గుండ తీసికొని వెళ్ళినను పాలీయక తన్నినట్లు లోభిని యాచించినచో బ్రయోజనములేదు.

ఆ. మేఁక కుతికబట్టి మెడచన్నుగుడువగా
ఆకలేలమాను నాశగాక
లోభివాని నడుగ లాభంబులేదయా విశ్వ. 44

టీ. విశ్వ...వేమ-మేఁక=మేకయొక్క, కుతిక=గొంతుక, బట్టి=పట్టుకొని, మెడచన్ను=మెడచన్నును, కుడువగా=కుడిచినచో, ఆకలి, ఏలమాను=మానును, ఆశగాక=వట్టియాశయేగాని, లోభివాని, అడుగ, లాభంబు, లేదయా.

తా. మేక మెడచన్ను బట్టుకొని కుడిచిన నాకలి తీరనట్లు లోభివాని నడిగినందువలన బ్రయోజనములేదు.

ఆ. ఏమి గొంచు వచ్చె నేమి తాఁగొనిపోవు
బుట్టువేళ నరుడు గిట్టువేళ
ధనము లెచటకేగుఁ దానెచ్చటికినేగు విశ్వ. 45

టీ. విశ్వ...వేమ-ఏమి=దేనిని, గొంచు=తీసికొని, వచ్చె=వచ్చెను, ఏమి-తాన్=తాను, కొనిపోవు=కొనిపోవును, పుట్టువేళ = పుట్టునప్పుడు నరుఁడు=మానవుడు, గిట్టువేళ=చచ్చువేళ, ధనములు = సంపదలు, ఎచటికి=ఎక్కడికి, ఏగు=ఏగును, తాన్=తాను, ఎచ్చటికి-ఏగు

తా. మానవుడు పుట్టినప్పుడేమి తీసుకొనివచ్చును. చచ్చునప్పుడేమి తీసికొని పోవును. ఈ సంపద లెక్కడికి పోవును. తానెక్కడిక బోవును.

ఆ. తనువ దెవరిసొమ్ము తనదని పోషింప
ద్రవ్య మెవరిసొమ్ము దాచుకొనగ
బ్రాణ మెవరిసొమ్ము పారిపోకను నిల్వ విశ్వ. 46

విశ్వ... వేమ, తనువు = శరీరము, ఎవరి సొమ్ము = ఎవ్వరి యొక్క ధనము, తనదని=తనదియని, పోషింప=పోషించుటకు, ద్రవ్యము=ధనము, ఎవరిసొమ్ము, దాచుకొనగ = దాచుకొనుటకు, ప్రాణము = జీవము, ఎవరి-సొమ్ము, పాటిపోకను=మనలను విడిచిపోకుండ, నిల్వ=నిల్పుటకు.

తా. ఈ శరీరమెవరి సొమ్ము. ఈ ద్రవ్య మెవరిది. ప్రాణముపోకుండ నిల్పుట కెవ్వరి సొమ్ము.

ఆ. పెట్టిపొయ్యలేని వట్టి నరులు భూమి
బుట్టనేమి వారు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా విశ్వ. 47

టీ. విశ్వ... వేమ- పెట్టిపొయ్యలేని=దానము సేయని, వట్టినరులు= ప్రయోజనములేని మానవులు, పుట్టనేమి=పుట్టిననేమి, వారు=వారు, గిట్టనేమి=చచ్చిననేమి, పుట్టలోన=పుట్టయందు, చెదలు = చెదపురుగులు, పుట్టవా=పుట్టవా, గిట్టవా=చావవా,

తా. దానము సేయని వట్టినరులు పుట్టిననేమి గిట్టిననేమి, పుట్టలలో చెదపురుగులు పుట్టుటలేదా ?

—♦ అన్నదానము. ♦—

ఆ. అన్నిదానములను నన్నదానమె గొప్ప
కన్నతల్లి కంటె ఘనములేదు
ఎన్నగురునికన్న నెక్కువ లేదయా విశ్వ. 48

టీ. విశ్వ... వేమ, అన్నిదానములను = అన్నిదానములలోను, అన్నదానమె=అన్నదానమే, గొప్ప=శ్రేష్ఠము, కన్నతల్లికంటె, ఘనములేదు= గొప్పదిలేదు, ఎన్న=ఎన్నగా, గురునికన్న = గురునికంటె, నెక్కువలేదయా = ఎక్కువలేదు.

తా. అన్ని దానములలోను అన్న దానము శ్రేష్ఠము. కన్న తల్లికంటెను, గురునికంటెను నెక్కువ యేమియును లేదు.

—♦ ఆశ. ♦—

ఆ. ఆశచేత మనుజు లాయువు గలనాళ్ళు
తిరుగుచుందురు భ్రమ ద్రిప్ప లేక
ముఱికి భాండమందు ముసురు నీగల భంగి విశ్వ. 49

టీ. విశ్వ... వేమ, ఆశచేత=ఆశవలన, మనుజులు=మనుష్యులు, ఆయువు=ఆయుర్దాయము, కలనాళ్ళు = ఉన్నంతవఱకు తిరుగుచుందురు, భ్రమ=కోరిక, ద్రిప్పలేక=విడువలేక, ముఱికి = దుర్వాసనగల, భాండమందు=కుండయందు, ముసురు=కూడు ఈగల, భంగి=వలెను.

తా. మానవులు భ్రమతిప్ప లేక ఆయువ యున్నన్నాళ్ళు ముఱికికుండలో ముసరు ఈగలట్లు తిరుగుచుందురు.

ఆ. నీళ్ళలోనిమీను నెఱి మాంసమాశించి
గాలమందు జిక్కు కరణి భువిని
ఆశదగిలి నరుడు నాలాగె చెడిపోవు విశ్వ. 50

టీ. విశ్వ... వేమ, నీళ్ళలోని=నీటియందుండు, మీను=చేప, నెఱి మాంసము, ఆశించి=కోరి, గాలమందు=గాలమున, చిక్కుకరణి=చిక్కుకొనువిధమును, భువిని=భూమియందు, ఆశ=ఆశయందు, తగిలి=తగుల్కొని, నరుడు, ఆలాగె=అట్లె, చెడిపోవు=నశించును.

తా. నీటియందున్న చాప మాంసమునకాశించి గాలమునకు జిక్కుకొనునట్లు, మానవుడాశయందు దగుల్కొని చెడిపోవును.

ఆ. ఆస పాపజాతి యన్నిటికంటెను
ఆసచేత యతులు మోసపోరె
చూచి విడుచువారు శుద్ధాత్ములెందైన విశ్వ. 51

టీ. విశ్వ...వేమ- ఆస=ఆశ పాపజాతి = పాపపుదెగలోనిది, అన్నిటికంటెను, ఆసచేత=ఆయాసచేత, యతులు=యోగులు, మోసపోర =మోసపోవలేదా, చూచి=చూచి, విడుచువారు = వదలువారు, శుద్ధాత్ములు=మంచిమనస్సులుగలవారు.

తా. అన్నిటియందును ఆస మిగుల పాపముగలది. దానిచేత యోగులుగూడ మోసపోయినారు. కావున దాని నెఱిగి విడుచువారు మంచివారు.

ఆ. ఆశగోసి వేసి యనలంబు చల్లార్చి
గోఁచి బిగియగట్టి గుట్టు దెలిసి
నిలిచినట్టివాడె నెఱయోగి యెండైన విశ్వ. 52

టీ. విశ్వ... వేమ, ఆశ=ఆశను, గోసి వేసి...అనలంబు = అగ్నిని, (ఆశయను నగ్నిని) చల్లార్చి=చల్లార్చి. గోచి, బిగియగట్టి= గట్టిగాగట్టుకొని, గుట్టు తెలిసి=ఈజన్మము యొక్క రహస్యమును నెఱిగి, నిలిచినట్టివాడె=వున్నవాడే, నెఱయోగి=యతీశ్వరుడు, ఎండైన=ఎక్కడనైన,

తా. ఆశయను నగ్నిని చల్లార్చి, గోచి బిగించి, మానవరహస్యమును తెలిసికొనినవాడే యోగి.

ఆ. చచ్చి పడిన పశువుచర్మంబు కండలు
పట్టి పెఱికి తినును బరగ గ్రద్ద
గ్రద్దవంటివాడు గజపతికాడకో విశ్వ. 53

టీ. విశ్వ... వేమ, చచ్చిపడిన=చచ్చిపోయిన, పశువు = పశువు యొక్క, చర్మము=చర్మమున, కండలు, పట్టి, పెఱికి=లాగి, తినును=భుజించును, పరగ=ఒప్పుగా, గ్రద్ద, గ్రద్దవంటివాడు = అగ్రద్దవంటివాడు, గజపతి=ధనమున్నవాడు, కాడకో=కాదా.

తా. ధనముకలిగి యాసకలవాడు, చచ్చినపశువుల కండల పీకి తిను గ్రద్దవంటివాడు

ఆ. కనకమృగము భువిని గద్దు లేదనకను
దరుణి విడిచి చనియె దాశరథియు
దెలివి లేనివాఁడు దేవుఁడెట్లాయెరా విశ్వ. 54

టీ. విశ్వ... వేమ. కనకమృగము=బంగారపులేడి, భువిని=భూమిలో. కద్దు=కలదు, లేదు=లేదు, అనకను=ఆలోచింపకుండా, తరుణి=భార్యను, విడిచి=వదలి, చనియె=వెళ్ళెను, దాశరథి=రాముఁడు, తెలివిలేనివాఁడు=యోచనలేనివాఁడు, దేవుఁడెట్లాయెరా=దైవమెట్లయ్యెను.

తా. బంగారపు లేడి ఉన్నదా లేదా యని ఆలోచింపకుండా రాముడు భార్యను విడిచి వెళ్ళెను. ఇతడు దైవమెట్లయ్యెను.

—♦ భోగ భాగ్యము. ♦—

ఆ. అలను బుగ్గ పుట్టినప్పుడె క్షయమౌను
కలను గాంచు లక్ష్మి గనుట లేదు
ఇలను భోగ భాగ్య మీతీరుగాదకో విశ్వ. 55

టీ. వేమ విశ్వ...అలను=అలయందు, బుగ్గ=బుడగ, పుట్టినప్పుడే=కలిగిన వెంటనే, క్షయమౌను=నశించును, కలను=కలలో, గాంచు=చూచెడి, లక్ష్మి=సంపద, గనుట లేదు=అనుభవించుట లేదు, ఇలను=భూమిని, భోగభాగ్యము=భోగము, సంపద, ఈతీరు కాదకో=ఇట్లు కాదా.

తా. భోగభాగ్యములు అలలయందు బుట్టి యప్పుడే నశించు బుడగలవంటివి.

ఆ. కోతినొనర దెచ్చి కొత్తపట్టముగట్టి
కొండముచ్చులెల్ల గొలిచినట్టు
నీతిహీను నొద్ద నిర్భాగ్యులుండుట విశ్వ. 56

టీ. విశ్వ... వేమ, కోతి = కోతిని, ఒనర=ఒప్పుగా, తెచ్చి=తెచ్చి కొత్త=నూతనమైన, పట్టముగట్టి, రాజ్యాభిషేకముజేసి, కొండముచ్చులు= కొండముచ్చులు, ఎల్ల = అన్నియును, గొలిచినట్లు=సేవించినట్లు, నీతిహీను నొద్ద=జ్ఞానములేనివాని యొద్ద, నిర్భాగ్యులు=నిర్భాగ్యులు, ఉండుట.

తా. జ్ఞానహీనుల యొద్ద నిర్భాగ్యు లుండుట, కోతికి బట్టముగట్టి కొండముచ్చులు గొలిచినట్టే.

ఆ. కల్లలాడు వాని గ్రామకర్త యెఱుంగు
సత్యమాడువాని స్వామి యెఱుగు
బెక్కు తిండిపోతుఁ బెండ్లామెరుంగురా విశ్వ. 57

టీ. విశ్వ... వేమ, కల్లలాడువాని = అబద్ధము చెప్పువానిని, గ్రామ కర్త=గ్రామాధికారి, యెఱుఁగు=ఎఱుఁగును, సత్యమాడువానిని = నిజము బలుక్కువానిని, స్వామి=భగవంతుడు, ఎఱుగు, బెక్కు=అనేకములు, తిండి పోతు=తినువానిని, పెండ్లాము, ఎఱుగు=ఎఱుగును.

తా. కల్లలాడువానిని గ్రామాధికారి యెఱుగును, నిజముబలుక్కువానిని దైవమెఱుగును. తన తిండిభార్య యెఱుగును.

ఆ. కల్ల నిజములెల్ల గరకంఠు డెఱుగును
నీరు పల్లమెఱుగు నిజముగాను
దల్లి తానెఱుగును దనయుని జన్మంబు విశ్వ. 58

టీ. విశ్వ... వేమ, కల్ల, నిజములు=అబద్ధములు, నిజములు, ఎల్ల= అన్నియు, గరకంఠుడు=ఈశ్వరుడు, ఎఱుగును, నీరు=జలము, పల్లమెఱు గును=పల్లమును నెఱుగును, నిజముగాను, తల్లి, తాన్=తాను, ఎఱుగును, తనయుని=కుమారుని, జన్మంబు = పుట్టుక.

తా. నిజానిజములు ఈశ్వరునకు దెలియును. నీరు పల్లము నెఱుగును తన కుమారుని పుట్టుక తల్లికి దెలియును.

ఆ. మైలకోకతోడ మాసిన తలతోడ
ఒడలు ముఱికితోడ నుండెనేని
అగ్రకులజుడైన నట్టిట్టు పిల్వరు విశ్వ. 59

టీ. విశ్వ... వేమ, మైలకోకతోడ=శుభ్రముగాలేని వస్త్రముతోడ, మాసినతలతోడ=మాసిన శిరస్సుతోడ, ఒడలు = శరీరము, ముఱికితోడ, నుండెనేని=ఉన్న చో, అగ్రకులజుడైన=ఎక్కువకులములో బుట్టినవాడైన, అట్టిట్టు=ఎక్కువ గౌరవముగా, పిలువరు.

తా. మైలవస్త్రముతోడను, మాసిన తలతోడను, ముఱికియొడలు తోడను గనిపించినచో మంచికులముగలవాని నైనను గౌరవముగ జూడరు.

ఆ. చెట్టుపాలు జనులు చేదందురిలలోన
ఎనుపగోడ్డుపా లదెంతహితవు
పదుగురాడుమాట పాటింపనిజమయా విశ్వ. 60

టీ. విశ్వ... వేమ, చెట్టుపాలు=చెట్టుయొక్కపాలు, చేదు=చేదని, అందురు=అందురు, ఇలలోన=భూమియందు, ఎనుపగోడ్డు=గేదె, పాలు, అదెంత=అది యేమి, హితవు=ఇష్టము, పదుగురు = పదిమంది, ఆడుమాట, పాటింప=పాటిచేయుట, నిజమయా=నిజమాను.

తా. చెట్టుపాలు చేదందురు. గేదెపాలు తీపియందురు పదిమంది మాటయే పాటిసేయుట నిజము.

ఆ. ఉప్పులేనికూర యూనంబురుచులకు
ఒప్పులేనితిండి ఫలములేదు
అప్పులేనివాడె యధికసంపన్నుడు విశ్వ 61

టీ. విశ్వ... వేమ. ఉప్పు, లేని, కూర, యూనంబు=హీనము, రుచులకు, ఒప్పులేని-తిండి, ఫలములేదు=సార్థకములేదు, అప్పులేనివాడె, అధికసంపన్నుడు=ఎక్కువభాగ్యశాలి.

ఆ. పట్టు పట్టరాదు పట్టు విడువరాదు
పట్టెనేని బిగియఁ బట్టవలయు
బట్టు విడుటకన్నఁ బరగఁజచ్చుట మేలు విశ్వ 62

టీ. విశ్వ... వేమ, పట్టు = ఏదియైనను పనిచేయవలయునను దీక్ష, పట్టరాదు=వహింపరాదు, పట్టి=అట్టిదీక్షనువహించి, విడువరాదు = వదలరాదు, పట్టెనేని=వహించినచో, బిగియ=గట్టిగా, పట్టవలయును=వహింపవలయు, పట్టి=వహించి, విడుటకన్న=విడుచుటకన్న, బరగ=ఒప్పుగా, చచ్చుట-మేలు=మంచిది.

తా. ఏదియైనను కార్యము చేయవలసి వచ్చినప్పుడు ముందు పట్టుదల వహింపరాదు. వహించిన పిదప వదలరాదు. దీక్షవహించి వదలుటకన్న చచ్చుట మంచిది

ఆ. అనఁగననఁగ రాగ మతిశయిల్లుచునుండు
దినఁగ దినఁగ వేము తీపిగలుగు
సాధనమునఁ బనులు సమకూరు ధరలోన విశ్వ. 63

టీ. విశ్వ... వేమ-అనఁగనఁగ=అనగా అనగా, రాగము-అతిశయిల్లుచునుండు=వృద్ధిబొందుచుండు, తినఁగ తినఁగ=తినగా తినగా, వేమున=వేపయందు, తీపు=తియ్యదనము, కలుగును, సాధకమున = ప్రయత్నమున, పనులు= కార్యములు, సమకూరు=కొనసాగును, ధరలోన=భూమిలోన.

తా. అనగా అనగా రాగము బయలుదేరును. తినగా తినగా వేప, తియ్యగానుండును. ఏకార్యమైనను ప్రయత్నము మీద కొనసాగును.

ఆ. తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్విజనులకెల్ల నుండుఁ దప్పు
తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు విశ్వ. 64

టీ. విశ్వ... వేమ-తప్పులు=దోషములు, ఎన్నువారు = లెక్క-పెట్టు వారు, తండోపతండంబులు=అనేకమంది, ఉర్వి=భూమిని, జనులకెల్ల=అం దఱికిని, ఉండుక=ఉండును, తప్పు-తప్పులు-ఎన్నువారు = లెక్క-పెట్టు వారు, తమతప్పు=తమతప్పు, ఎఱుఁగరు.

తా. తప్పుల నెన్నువారనేకులుందురు. ప్రతివానికిని దప్పుండును ఇతరులతప్పుల నెన్నువారు తమతప్పు లెఱుఁగరు.

ఆ. తనకుఁగల్గు పెక్కు-తప్పులు నుండఁగా
ఓగు నేరమెంచు నొరులఁగాంచి
చక్కిలంబు గాంచి జంతిక నగినట్లు విశ్వ. 65

టీ. విశ్వ... వేమ, తనకు=తనకు, కల్గు=ఉన్న, పెక్కు=ఎక్కు-వ, తప్పులు, ఉండఁగా=కలుగఁగా, ఓగు=చెడ్డవాడు, నేరము = దోషము, ఎంచు=లెక్క పెట్టును, ఒరుల=ఇతరుల, గాంచి=చూచి, చక్కిలంబు= చక్కిలంబును, గాంచి=చూచి, జంతిక=జంతిక, నగినట్లు=నవ్వినట్లు.

తా. చెడ్డవాడు తనదగ్గఱ పెక్కు తప్పులుండఁగా, చక్కిలమును గాంచి జంతిక నవ్వినట్లు యొరులతప్పు లెంచును.

ఆ. ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు
కాచి యతుకవచ్చు క్రమముగాను
మనసు విఱిగెనేని మఱిచేర్పరాదయా విశ్వ. 66

టీ. విశ్వ... వేమ, ఇనుము=ఇనుము, విఱిగెనేని=విఱిగినచో, యిను మాఱు=రెండుసార్లు, ముమ్మాఱు=మూడుసార్లు, కాచి=కాచి, యతుక వచ్చు=అతికింపవచ్చును, క్రమముగాను మనస్సు=చిత్తము, విఱిగెనేని= విఱిగినచో, మఱి=చేర్పరాదయా=కుదురుపఱచలేము.

తా. ఇనుము విఱిగినచో రెండు మూడు సారులు కాచి యతికింప వచ్చును గాని మనస్సు విఱిగినచో మరల కుదురుపఱచ జాలము.

ఆ. ఒకనిఁ జెఱచెదమని యుల్లమందెంతురు
తమదుచేటెఱుఁగరు ధరను నరులు
తమ్ముఁ జెఱచువాడు దైవంబుగాడకో విశ్వ. 67

టీ. విశ్వ... వేమ—ఒకనిన్ =ఒకనిని, చెఱచెదమని= చెఱచుటకు, యుల్లమందు=మనస్సులో, ఎంతురు= తలతురు, తమదు = తమయొక్క, చేటు = అపాయము, ఎఱుఁగరు=కనుగొనరు, ధరను=పుడమిలో, నరులు= మనుష్యులు, తమ్ము, చెఱచువాడు=దైవంబు, దేవుడు, కాడకో=కాదా!

తా. కొందఱు ఇతరులను చెఱచుటకుదలంతురుగాని తమ్ము జెఱచు వాడు దైవమున్నాడని యెఱుఁగరు.

ఆ. చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మను టేచాలు విశ్వ. 68

టీ. విశ్వ... వేమ, చంప=చంపుటకు, తగినయట్టి=తగినట్టి, శత్రువు= విరోధి, తనచేత=తనచేతికి, చిక్కెనేని=చిక్కినచో, కీడు = అపాయము, సేయరాదు, పొసగ=యొప్పుగా, మేలుచేసి = మంచిచేసి, పొమ్మనుటే = వెళ్ళమనుటయే, చాలు.

తా. చంపదగిన శత్రువు తనకు జిక్కినను కీడు సేయక మేలు చేసి పొమ్మనుట మంచిది.

ఆ. మాటలాడనేర్చి మనసు రాజిలజేసి
పరగ బ్రియము చెప్పి బడలకున్న
నొకరి చేతి సొమ్ము లూరకవచ్చునా విశ్వ. 69

టీ. విశ్వ... వేమ, మాటలు=పలుకులు, ఆడ=పలుక, నేర్చి=నేర్చుకొని, మనసు=చిత్తము, రాజిలన్=రంజిల్ల, చేసి, పరగ, యొప్పుగా, ప్రియము =

హితము, చెప్పి, బడలకున్న, ఒకరిచేతి సొమ్ములు=ఇంకొకరి యొద్ద నున్న సొమ్ములు ఊరకవచ్చునా.

తా. మంచిమాటలను చెప్పి మనస్సు రంజిల్ల జేయకున్నచో నొకరి చేతిలో నున్న సొమ్ము లూరక వచ్చునా ?

ఆ. కానివానిచేత గాసువీసంబిచ్చి
వెంట దిరుగువాడు వెఱ్ఱివాడు
పిల్లితిన్నకోడి పిలిచిన బలుకునా విశ్వ. 70

టీ. విశ్వ...వేమ-కానివానిచేత = హీనుని చేతికి, కాసువీసంబు, ఇచ్చి=ఇచ్చి, వెంట=(వాని)వెంట, తిరుగువాడు, వెఱ్ఱివాడు = అవివేకి, పిల్లి=పిల్లి, తిన్న = తినిన, కోడి, పిలిచిన, పలుకునా=మాట్లాడునా.

తా. హీనుని చేతిలో డబ్బుపెట్టి వాని వెంట దిరుగువాడు వెఱ్ఱివాడు పిల్లిచే దినబడినకోడి పలుకునా.

ఆ. వాన గురియకున్న వచ్చును క్షామంబు
వాన గురిసెనేని వఱద పారు
వఱద కఱవురెండు వరుసతో నెఱుగుడీ విశ్వ. 71

టీ. విశ్వ... వేమ, వానగురియకున్న = వానకురియక పోయినచో, వచ్చును=వచ్చును, క్షామంబు=కఱవు, వానగురిసెనేని=వానగురిసినచో, వఱదపారు=వఱద కలుగును, వఱద, కఱవు, రెండు=రెండున్ను, వరుసతో నెఱుగుడీ=వచ్చునని యెఱుగుడు.

తా. వర్షములేకున్న కఱవు. వర్షమున్నచో వరద. రెండును వచ్చునని తెలియుడు.

ఆ. పుట్టిన జనులెల్ల భూమిలోనుండిన
బట్టునాజగంబు పట్టదెపుడు
యముని లెక్క రీతి నరుగుచునుందురువిశ్వ. 72

టీ. విశ్వ... వేమ, పుట్టినజను లెల్ల = పుట్టినవారందఱు, భూమిలో = భూమిపైన, ఉండినట్టి = ఉన్నచో, పట్టునా, జగంబు = లోకము పట్టదు, ఎప్పుడు, యముని = యమధర్మరాజుయొక్క; లెక్కరీతి = లెక్క ప్రకారము; అరుగుచునుందురు = అరుగుచుందురు.

తా. పుట్టినవారెల్ల భూమియందున్నచో లోకముపట్టదు. యముని లెక్కప్రకారము అందఱు పోవుచుందురు

ఆ వానరాకడయును బ్రాణంబుపోకడ
కానఁబడదదెంత ఘనునకైన
గానఁబడినమీఁద గలియెట్లు నడచురా విశ్వ, 73

టీ. విశ్వ... వేమ, వానరాకడయును = వర్షము వచ్చుటయును, ప్రాణంబుపోకడ = ప్రాణము పోవుటయును; కానబడదు = కనిపించదు; ఎంత = ఎట్టి; ఘనునకైన = గొప్పవానికైన; కానబడినమీద = కనిపించినపిదప; కలి = కలియుగము; ఎట్లు = ఏవిధమున; నడచురా = నడచును.

ఆ. చిప్పఁబడ్డ స్వాతిచినుకు ముత్యంబాయె
నీటఁబడ్డ చినుకు నీటఁ గలసెఁ
బ్రాప్తిగల్గుచోట ఫలమేలదప్పురా విశ్వ. 74

టీ. విశ్వ... వేమ; చిప్పబడ్డ = చిప్పయందుబడిన; స్వాతిచినుకు = స్వాతివానచినుకు; ముత్యంబాయె (ముత్యంబు + ఆయె) = ముత్యమయ్యెను; నీటఁబడ్డ = నీటియందుబడిన; చినుకు = చినుకు; నీటఁగలిసె = నీటిలోకలిసెను; ప్రాప్తి = కార్యముఅగుట; గల్గుచోట = అయ్యేస్థలమున; ఫలమేల = ఫలమెందుకు; తప్పురా = తప్పును.

తా. స్వాతివానచినుకు చిప్పయందుబడినచో ముత్యమగును. నీటబడిన గలిసిపోవును. ప్రాప్తియున్నచో ఫలమెందుకు దప్పును?

ఆ. ఎన్నిచోట్లు తిరిగి యేపాట్లు పడినను
అంటనియ్యక శని వెంటదిరుగు
భూమిక్రొత్తలైన భుక్తులు క్రొత్తలా విశ్వ. 75

టీ. విశ్వ... వేమ- ఎన్నిచోట్లు=ఏస్థలములు. తిరిగి = సంచరించి, ఏపాట్లు పడినను=ఎట్టి కష్టములు పడినను, అంటనియ్యక = పొందనియ్యక, శని=శని, వెంట=వెంటనే, తిరుగు=తిరుగును, భూమి = భూమి, క్రొత్తలై=క్రొత్తయైన, భుక్తులు=తిండులు క్రొత్తలా.

తా. ఏస్థలములు తిరిగినను, ఏకష్టములు పడినను ఏమియు బొందనీయక శని వెన్నంటుచునే యుండును. భూమి క్రొత్తలైన భుక్తిక్రొత్తదా!

ఆ. అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచెమైన నదియుఁ గొదువ కాదు
కొండయద్దమందు కొంచెమై యుండదా విశ్వ. 76

టీ. విశ్వ.. వేమ, అనువుగానిచోట=వీలుగాని ప్రదేశమున, అధికులము=గొప్పవారమని, అనరాదు=పలుకరాదు, కొంచెముయిన = కొంచెమైన, అదియు=అది, కొదవకాదు=కొఱఁకాదు, కొండ=కొండ, అద్దమందు= అద్దములోన, కొంచెమై యుండదా=కొంచెముగా నుండగా.

తా. వీలుగాని స్థలమున మన మధికులమని చెప్పుకొనరాదు. కొంచెము వారమన్నను కొఱతలేదు. అద్దమందు కొండ చిన్నదిగ గనుపించదా.

ఆ. ఇమ్ము దప్పువేళ నెమ్మె లన్నియు మాని
కాల మొక్కరీతి గడపవలయు
విజయుఁ డిమ్ముదప్పి విరటుని కొల్వఁడా విశ్వ. 77

టీ. విశ్వ... వేమ, ఇమ్ము=స్థానము, తప్పువేళ=తప్పుసమయమున, నెమ్మెలు=విషయములు, అన్నియు, మాని=విడిచి, కాలము, ఒక్కరీతి =

ఒక రీతిగా, గడపవలయును=పుచ్చవలయును, విజయుఁడు = అర్జునుడు, ఇమ్మ=స్థానము, తప్పి=విడిచి, విరటుని = విరటరాజును, కొల్వఁడా = సేవింపడా.

తా. స్థానము తప్పినప్పుడు విషయము లన్నియు విడిచి కాలమును గడపవలయును. అర్జునుడు విరటుని కొలువలేదా.

ఆ. కర్మమధికమయిన గడచిపోవగరాదు
ధర్మరాజుదెచ్చి తగని చోట
గంకుభొట్లఁ జేసెఁ గటకటా దైవంబు విశ్వ. 78

తా. విశ్వ .. వేమ-కర్మము=తాను జేసిన కర్మము, అధికమయిన= ఎక్కువ యైనచో, గడచిపోవగరాదు=దాటవలనుపడదు, ధర్మరాజు=ధర్మరాజును, దెచ్చి=తెచ్చి, తగనిచోట = యతడుండదగిన స్థలమును, గంకుభొట్ల=గంకుబొట్టుగా, జేసెన్=చేసెను, కటకటా = అయ్యయ్యో, దైవంబు = దేవుడు.

తా. కర్మమును నెవ్వరు గడువజాలరు. అంతటివాడైన ధర్మరాజును దైవము గంకుభట్టుగ జేసి విరటుని గొలిపించినాడు.

ఆ. లక్ష్మియేలినట్టి లంకాధిపతిపురి
పిల్లకోతి పౌఁజు కొల్లపెట్టె
జేటుకాలమయిన జెరుపనల్పుడెచాలు విశ్వ. 79

టీ. విశ్వ... వేమ,లక్ష్మి=లక్ష్మిదేవి, ఏలినట్టి=పరిపాలించిన, లంకాధిపతిపురి=రావణుని పురమగు లంక, పిల్లకోతిపౌఁజు = చిన్న కోతుల గుంపు, కొల్లపెట్టె - దోచెను, చేటుకాలమున = వినాశమగు కాలమువచ్చినచో, చెరుప=చెరుపుటకు, అల్పుడే=చిన్నవాడే, చాలు.

తా. లక్ష్మి యేలిన లంకను పిల్లకోతులగుంపు కొల్లగొట్టెను కాలము సమీపించినచో ఎంత బలవంతునినైనను వంచుటకు అల్పుడే చాలును.

ఆ. చిక్కియున్న వేళ సింహంబునైనను
బక్కకుక్క కఱచి బాధచేయు
బలిమిలేని వేళ బంతంబుచెల్లదు విశ్వ. 80

టీ. విశ్వ... వేమ, చిక్కియున్న వేళ=బలముతగ్గియున్న సమయమున, సింహంబునైనను=సింహమునైనను; బక్కకుక్క, కఱచి, బాధచేయు= బాధకలిగించును, బలిమి=బలము, లేని వేళ=లేనప్పుడు, పంతము, చెల్లదు= సాగదు.

తా. బలము లేనప్పుడు సింహమునైనను బక్కకుక్కకఱచి బాధ కలిగించును. బలములేనప్పుడు పంతము చెల్లదు.

ఆ. మొదట నాశపెట్టి తుదిలేదు పొమ్మను
పరమలోభులైన పాపులకును
ఉసురు తప్పకంటు నుండేలుదెబ్బగా విశ్వ. 81

టీ. విశ్వ... వేమ, మొదట = తొలుత, ఆశపెట్టి = ఆశకలిగించి, తుది=చివరకు, లేదు, పొమ్మను=పొమ్మను, పరమలోభులైన=మిక్కిలిలోభులైన, పాపులకును=పాపాత్ములకును, ఉసురు=ఉసురు, తప్పక =తప్పకుండా, అంటు=అంటును, ఉండేలుదెబ్బగా=ఉండేలుదెబ్బవిధమున.

తా. మొదట నాశపెట్టి తరువాత లేదను లోభుల కుసురు ఉండేలు దెబ్బగా తగిలి తీరును.

ఆ. ఇచ్చువానియొద్ద నీయనివాడున్న
చచ్చుగాని యీవి సాగనీడు
కల్పతరువుక్రింద గచ్చపొదున్నట్లు విశ్వ. 82

టీ. విశ్వ... వేమ, ఇచ్చువానియొద్ద = దానముచేయువానియొద్ద, ఈయనివాడు=లోభి; ఉన్న=ఉండిన; చచ్చుగాని=చచ్చునుగాని, ఈవి=

ఇచ్చుట, సాగనీడు=చేయనీయడు; కల్పతరువుక్రింద=కల్పవృక్షముక్రింద గచ్చపొద, ఉన్నట్లు.

తా. కల్పవృక్షముక్రింద గచ్చపొద యున్నట్లు; ధర్మవంతునిదగ్గర లోభి యున్నచో ధర్మము సేయనీయడు.

ఆ. అరయ నాస్తి యనక యడ్డు మాటాడక
తట్టువడక మదిని దన్నుకొనక
తనది గాదనుకొని తాబెట్టునదే పెట్టు విశ్వ. 83

టీ. విశ్వ... వేమ; అరయు = అరయుగా, నాస్తియనక = లేదనక, యడ్డుమాటాడక=అడ్డుచెప్పక; తట్టువడక=తొట్రుపాటుపడక; మదిని=మనస్సులో, తన్నుకొనక; తనది=తనది; కాదనుకొని=కాదనియెంచి; తాన్=తాను, పెట్టునదె=ఇచ్చునదె, పెట్టు=కూలి.

తా. లేదనకుండా, తొట్రుపాటుపడక, మనస్సులో తన్నుకొనక ఉన్నది తనదికాదనుకొని, పెట్టిన పెట్టే పెట్టు.

ఆ. ధనముకూడబెట్టి దానంబుచేయక
తాను దినక లెస్స దాచుగాక
తేనెటీగకూర్చి తెరువరికియ్యదా విశ్వ. 84

టీ. విశ్వ... వేమ, ధనము=ద్రవ్యము, కూడబెట్టి=జాగ్రత్తజేసి, దానంబుచేయక=దానముచేయక, తాను=తాను, తినక = తినకుండా, లెస్స=ఎక్కువగా, దాచుగాక=దాచుకాక, తేనెటీగ, కూర్చి=దాచి, తెరువరికి=బాటసారికి, ఇయ్యదా=ఇయ్యదా.

తా. లోభి ధనమును గూడబెట్టి దానము సేయక, తాను దినక దాచును. అయ్యది తేనెటీగ తేనెను జేర్చి తెరువరికిచ్చినట్లగును.

ఆ. కొంకణంబుపోవ గుక్క సింహముకాదు
కాశికరుగ బంది గజముకాదు
వేయుజాతివాడు విప్రుండు కాలేడు విశ్వ. 85

టీ. విశ్వ... వేమ, కొంకణంబు=కొంకణంబునకు, పోవక=పోయిన, కుక్క, సింహముకాదు=మృగరాజు కాదు, కాశికి=కాశికి, అరుగక=అరిగిన, పంది, గజము = ఏనుగు కాదు. వేఱుజాతివాడు = ఇతర కులము వాడు, విప్రుండు=బ్రాహ్మణుడు, కాలేడు=కానేరడు

తా. కొంకణమునకు బోయినను కుక్క సింహముగాలేనట్లును, కాశికిబోయినను పంది ఏనుగు కానట్లును, యితర కులమువాడు బ్రాహ్మణుడు కానేరడు.

ఆ. తవిటి కరయఁబోవ దండులంబులగంప
శ్వానమాక్రమించు సామ్యముగను
వైశ్యవరుని సొమ్ము వసుధనీచులకబ్బు విశ్వ. 86

టీ. విశ్వ .. వేమ, తవిటికి=తవుడును, అరయ=జూచుటకు, పోవ=పోవగా, తండులంబుల గంప = బియ్యపుగంప, శ్వానము=శ్వానము-ఆక్రమించు=వశము జేసికొను, సామ్యముగను=విధముగా, వైశ్యవరుని సొమ్ము=కోమటిధనము, వసుధ = భూమియందు, నీచులకు = హీనులకు, అబ్బు = లభించును.

తా. తవిటికిబోవ బియ్యపుతట్ట శ్వానమాక్రమించి నట్లు కోమటి సొమ్ము నీచులకు లభించును.

ఆ. దాతకాని వాని దరుచుగా వేడిన
వాడు దాతయౌనె వసుధలోన
అవురు దర్భయౌనె యబ్ధిలోముంచిన విశ్వ. 87

టీ. విశ్వ... వేమ, దాతకానివాని=దానముసేయనివానిని, తరుచుగా=అప్పుడప్పుడు, వేడిన=వేడికొన్నచో, వాడు=అతడు, దాతయౌనె=దాతయ

గుసా, వసుధలోన=భూమిలోన, అవురు=అవురుగడ్డి, దర్భయాసె=దర్భయగును, అబ్ధిలో=సముద్రములో, ముంచిన=ముంచినను.

తా. దాతకాని వానిని తఱుము అడిగినను దాతకాడు. అవురుగడ్డి సముద్రములో ముంచిన మాత్రమున దర్భయగును.

ఆ. పరగ ఱాతిగుండు పగులగొట్టగవచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తుమనసు కరగింపగారాదు విశ్వ. 88

టీ. విశ్వ... వేమ, పఱగ=ఒప్పుగా, ఱాతిగుండు=ఱాతిగుండును, పగులగొట్టవచ్చు = పగులగొట్టవచ్చును, కొండలన్ని = కొండలనన్నిటిని; పిండిగొట్టవచ్చు = పిండిగాచేయునచ్చును, కఠినచిత్తుమనసు = కఠినచిత్తుని యొక్క మనస్సు, కరగింపగా రాదు=కరగింపజాలము.

తా. ఱాతిగుండును పగులగొట్టవచ్చును. కొండలను పిండిసేయ వచ్చును. కఠినుని మనస్సుమాత్రము కఱగింపబడదు.

ఆ. వంపుకఱ్ఱ కాల్చి వంపు దీర్పగవచ్చు
కొండలన్ని పిండిగొట్టవచ్చు
కఠినచిత్తుమనసు కరగింపగారాదు విశ్వ. 89

టీ. విశ్వ... వేమ; వంపుకఱ్ఱ=వంకరగానున్నకఱ్ఱను, కాల్చి, వంపు =వంకర, దీర్పవచ్చును = పోగొట్టవచ్చును, కొండలన్ని పిండిగొట్టవచ్చు, కఠినచిత్తుమనసు కరగింపగారాదు.

తా. కాల్చి కఱ్ఱయున్న వంకరదీర్పవచ్చును. కొండలను పిండిచేయ వచ్చును. కాని, కఠినునిమనస్సు కరగింపలేము.

ఆ. విత్తముగలవాని వీపు పుండైనను
వసుధలోన జాల వార్త కెక్కు
బేదవానియింట బెండ్లైన నెరుగరు విశ్వ. 90

టీ. విశ్వ... వేమ, విత్తిముగలవాని = ధనవంతుని, వీపు=వీపునైన, పుండైన=కురుపులేచినచో, వసుధలోన=భూమిలోన, జాల=ఎక్కువగా, వార్త=వార్తకు, ఎక్కు=బయలుదేరును, పేదవానియింట=పేదవానియింటిలో; పెండ్లయిన=పెళ్ళియైనను, ఎఱుగరు=ఎఱుగరు.

తా. గొప్పవాని వీపుమీద కురుపులేచినచో యావార్త జగమెల్ల బ్రాకును. పేదవానియింట పెళ్ళియైనను యెవ్వరు చెప్పుకొనరు.

ఆ. ఆపదగల వేళ నరసి బంధుల జూడు
భయము వేళ జూడు బంటుతనము
పేద వేళ జూడు పెండ్లాము గుణమును విశ్వ. 91

టీ. విశ్వ... వేమ, ఆపదగలవేళ=ఆపద వచ్చిన వేళ, అరసి, బంధుల=బంధువుల, చూడు = చూడుము, భయము వేళ = భయ పడినప్పుడు, చూడు = చూడుము, బంటుతనము, పేద వేళ = దరిద్రము వచ్చినప్పుడు చూడు, పెండ్లాము గుణము=భార్యా గుణము.

తా. ఆపద వేళ బంధువులను జూడుము. భయపడినప్పుడు బంటుతనము చూడుము. దరిద్రము వచ్చినప్పుడు భార్యగుణము చూడుము.

ఆ. ఆలిమాటలు విని యన్నదమ్ముల బాసి
వేఱెపోవువాడు వెఱ్ఱివాడు
కుక్కతోక బట్టి గోదావరీదునా విశ్వ. 72

టీ. విశ్వ... వేమ, ఆలిమాటలు = భార్యమాటలు, విని = ఆలకించి, యన్నదమ్ముల = అన్నదమ్ములను, బాసి = విడిచి వేఱె=వేఱే, పోవువాడు=అరుగువాడు, వెఱ్ఱివాడు=అవివేకి, కుక్కతోక = కుక్కతోక, పట్టి=పట్టుకొనిన, గోదావరి=గోదావరి, ఈదునా=ఈదునా ?

తా. భార్యమాటలు విని వేఱే పోవువాడు వెఱ్ఱివాడు. కుక్కతోక బట్టుకొన్న గోదావరి యీదునా.

ఆ. మగని కాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖమునందు
కలిమిలేమి రెండు గల వెంతవారికి విశ్వ. 93

టీ. విశ్వ... వేమ, మగని కాలమందు=భర్త యున్నప్పుడు, మగువ=ఆడది, కష్టించిన=కష్టపడిన, సుతుల కాలమందు=కొడుకుల కాలములో సుఖమునందు=సౌఖ్యము బొందును. కలిమి = సంపద, లేమి=దరిద్రము, రెండు, గలవు=ఉన్నవి, ఎంతవారికి=ఎట్టివారికైనను.

తా. స్త్రీ మగనికాలములో కష్టపడినచో, సుతుల కాలమున సౌఖ్యముల బొందును. కలిమిలేము లెట్టివారికైననున్నవి.

ఆ. చెప్పులోనిరాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు నింతంతగాదయా విశ్వ. 94

టీ. విశ్వ .. వేమ, చెప్పులోనిరాయి = చెప్పులోపలనుండు రాయి, చెవిలోని జోరీగ = చెవియందుజేరుఈగ, కంటిలోని నలుసు = కంటిలో బడు నలుసు, కాలిముల్లు=కాలినందుముల్లు, ఇంటిలోనిపోరు = ఇంటిలో గలహము, ఇంతంతగాదయా=ఇట్లుండునని చెప్పలేము.

తా. చెప్పులో రాయి, చెవిలో ఈగ, కంటిలో నలుసు, కాలిముల్లు ఇంటిలో కలహము కడు బాధ కలిగించును.

ఆ. తల్లిదండ్రులపయి దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి
యింటబుట్టి పెరిగి యిల్లాలి బంటురా విశ్వ. 95

టీ. విశ్వ... వేమ-తల్లిదండ్రులపయి = తల్లిదండ్రులమీద, దయలేని పుత్రుడు=దయలేనికొడుకు, పుట్టనేమి=పుట్టిననేమి, గిట్టనేమి=చచ్చిన

నేమి, యింట=ఇంటియందు, బుట్టి=పుట్టి, పెరిగి = పెద్దవాడై, యిల్లాలి బంటురా = భార్యకు బంటు.

తా. తలిదండ్రుల పయిన దయలేని కొడుకు బుట్టిన నేమి! చచ్చిన నేమి! వాడు భార్యకు బంటు.

ఆ. తనకు లేనినాడు దైవంబు దూఱును
దనకు గల్గెలేని దైవమేల
తనకు దైవమునకు దగులాటమెట్టిదో విశ్వ. 96

టీ. విశ్వ... వేమ, తనకు=తనకు, లేనివాడు=ఏమియులేనికాలమున, దైవంబు=దైవమును, దూఱును = తిట్టును, తనకు, గల్గెనేని = ఉన్నచో, దైవమేల=దేవుడేల, తనకు=తనకును, దైవమునకు=దైవమునకును, దగులాటమెట్టిదో=తగులాటమేమో.

తా. లేనప్పుడు దేవుని దూరును. ఉన్నప్పుడు దైవమేల. దైవమునకు నతనికి సంబంధమేమిటి.

ఆ. మాటలాడుటొకటి మనసులో నొక్కటి
ఒడలిగుణము వేఱె యోజవేరె
ఎట్టుగల్గు ముక్తి యీలాగుతానుండ విశ్వ.

టీ. విశ్వ... వేమ; మాటలాడుటొకటి=పలుకుటొకవిధము; మనసులోనొక్కటి=మనస్సులో మఱియొకవిధము, ఒడలిగుణము=శరీరగుణము, వేఱె=మఱియొకతీరు, యోజవేఱె = ఆలోచన వేఱు, ఎట్టు = ఏతీరున, కల్గు=కలుగును, ముక్తి=మోక్షము, యీలాగు=ఈతీరున, తానుండ=తానుండగా.

తా. మాటయొకటి, మనసొకటి, గుణమొకటి, యోచన యింకొకటిగా నుండు వానికి ముక్తి యెట్లు కలుగును?

ఆ. అంతరంగమందు నపరాధములుచేసి
మంచివాని వలెనె మనుజుడుండు
ఇతరులెఱుగకున్న నీశ్వరుఁ డెఱుగడా విశ్వ. 98

టీ. విశ్వ... వేమ, అంతరంగమందు=మనస్సునందు; అపరాధములు= దోషములు, చేసి=కావించి, మంచివానివలెనే = మంచివానిరీతినే, మనుజుఁడుండు=మనుష్యుఁడుండును, ఇతరులు, ఎఱుఁగకున్న= తెలిసికొనకున్న; ఈశ్వరుడు= ఈశ్వరుడు; ఎఱుఁగఁడా=ఎఱుఁగఁడా; విశ్వ.

తా. మనస్సులో అపరాధములు చేసి, మంచివాని వలెనే మనుజుఁడు కానిపించినను వానిని ఈశ్వరు డెఱుంగును.

ఆ. ముచ్చు గుడికిఁబోయి ముడి విప్పనేగాని
పొసఁగ స్వామిఁజూచి మ్రొక్కఁడతఁడు
కుక్క యిల్లుసొచ్చి కుండలు వెదుకదా విశ్వ. 99

టీ. విశ్వ... వేమ, ముచ్చు = దొంగ, గుడికి = దేవాలయమునకు, పోయి=పోయి, ముడి విప్పనెగాని=ఎవరి కొంగునకైననున్న ధనము విప్పునె గాని. పొసఁగ=ఒప్పుగా, స్వామిన్=దేవుని, చూచి, మ్రొక్కఁడు, అతఁడు, కుక్క, యిల్లుసొచ్చి=యింటిలోఁ బ్రవేశించి, కుండలు వెదుకదా=అన్నపు కుండల వెదుకదా.

తా. దొంగ దేవాలయమునకు పోయినను మూటల విప్పుటకే చూచునుగాని, దేవునకు మ్రొక్కఁడు. ఇల్లుజొచ్చినకుక్క కూటి కుండల వెదుకదా.

ఆ. వేషభాషలెఱిఁగి కాషాయవస్త్రముల్
కట్టగానె ముక్తి కలుఁగబోదు
తలలు బోడులైన తలపులు బోడులా విశ్వ. 100

టీ. విశ్వ.. వేమ, వేషభాషలు= వేషముభాషలు, ఎఱిఁగి=గ్రహించి, కాషాయవస్త్రముల్ = కావిగుడ్డలు, కట్టగానే=ధరించినంతనే, ముక్తి= మోక్షము, కలుఁగబోదు=కలుగదు, తలలు=శిరములు, బోడులైన, తలపులు= ఊహలు, బోడులా.

తా. కాషాయ వస్త్రములు ధరించినంతనే ముక్తిరాదు. తలబోడి యైన తలపులు బోడియగునా?

# రామకృష్ణ జంత్రి.

ఇది కరణములపాలిటి కల్పవృక్షము. ప్రతికరణమువద్ద తప్పక వుండతగినది యిందుమూడు భాగములుకలవు.

1 భాగము యకరం 1 కి 0-1-0 మొదలుకొని 5-0-0 రూపాయలవరకు ప్రతి అణాకు 1 శెంటు మొదలుకొని 100 శెంట్లవరకున్ను యకరా మొదలుకొని 25 యకరములవరకును రు 5-2-0 మొదలుకొని 10-0-0రూపాయలవరకు ప్రతి రెండు అణాలకున్ను 1 శెంటుమొదలుకొని 100 శెంట్లవరకు యకరా మొదలుకొని 25 యకరములవరకు యకరం 1కి రు10 మొదలుకొని రు60-0-0 వరకుగల రేట్లలో 1 శెంటు మొదలుకొని 100 శెంట్లువరకును యకరా మొదలుకొని 25 యకరములకు కావలసిన వివరములుచక్కగా తెలుపును.

2 భాగం యూనిట్ 1 కి 0-0-1 మొదలుకొని రు1-0-0 వరకు పబ్లికువర్కు డిపార్టుమెంటువారికి కావలసిన సందర్భములు తెలుపును.

3 భాగం నెల 1 కి 0-4-0 మొదలుకొని 350-0-0 రూపాయలవరకు కావలసినజీతములు పెన్షనులు యింటి అద్దెలు యేనెలలో యెన్నిరోజులకు కావలసినవివరములు స్పష్టముగా తెలుపును.

త్వరపడి ఆర్డర్లుపంపువారికే బుక్కులు సప్లయికాబడును.

వెల రు 2—0—0.

# గణిత సంగ్రహము.

మొదటిభాగము. రెండవకూర్పు. వెల 0—8—0.

ఇది 3, 4, తరగతుల బాలురకు మిక్కిలియుపయుక్తము. రెండవ కూర్పునందు అనేక క్రొత్త విషయములు బొమ్మలుచేర్చి అచ్చువేయించినాము. గవర్నమెంటువారి సిలబసు ననుసరించి చక్కని ఉపమానములతో తేటతెల్లముగ నుండునటుల విపులముగా వ్రాయబడినది. ఉపాధ్యాయ సోదరులవల్లను, పరీక్షాధికారులవల్లను దీనిఉపయోగము వర్ణనాతీతముగాయున్నది. ఇందు 2000 వేలు లెఖ్ఖలుగలవు. దీనియందు అనేకక్రొత్తవిషయముల బాలురకుమిక్కిలి యుపయుక్తములగు బోధనాపద్ధతులు విశేషముగలవు. ప్రతిబాలుడు దీనిని ఉపయోగించిన క్లాసుకుమించిన ప్రవీణతను బెందుటకు యెంతమాత్రము సందియములేదు. బాలురపాలిటి కల్పవృక్షము. 160 పేజీలుగలవు. వెలస్వల్పము. ఫలమధికము,

# గణిత సంగ్రహము.

రెండవభాగము. రెండవకూర్పు. వెల 0—12—0.

ఇది 5, 6, తరగతుల బాలురకు మిక్కిలి యుపయుక్తము. రెండవ కూర్పునందు అనేకవిషయములు పెంచి తయారుగు చేయబడినది. ఇందు 3000 లెఖ్ఖలుగలవు. 300 పేజీలగ్రంథము. వంద బజారుబిల్లులు, అనేకవందల యుక్తి లెఖ్ఖలు చిఠారోజు ఆవర్జా మొదలగు విషయము అనేక మాదిరీల వడ్డీలెఖ్ఖలు గలవు. పరీక్షాధికారులు ఏర్పరచియుండు సిలబసు ననుసరించియున్నది. వెలస్వల్పము.

వలయువారు:—సీతారాం కంపెనీ
బుక్కుసెల్లర్సు, తెనాలి.